# తెనాలి పురపాలక సంఘ సమావేశము

## బడ్జెటు విషయమై వివాద

తెనాలి, మార్చి 24: స్థానిక పురపాలకసంఘ అత్యవసర సమావేశము మొన్న వైస్ చైర్మన్ రావి సత్యనారాయణ గారి అధ్యక్షతను జరిగినది. 27 గురు సభ్యులుమాత్రం హాజరైరి.

మునిసిపల్ జనరల్ ఫండ్సుయొక్క 48-49 సం॥ రం బడ్జెటు 1947 సం॥ నవంబరు నెల లోపుగా ప్రభుత్వమునకు పంపవలసియుండగా అటు పంపక ఆలస్యము చేసిరని, యీ హెచ్చరిక చేసిన తేదీ లగాయతు వారంరోజులలోగా బడ్జెటును ప్యాసుచేసి నకలు కాపీని గవర్నమెంటు వారికి పంపవలసినదని, అట్లు చేయనియెడల ప్రభుత్వము కౌన్సిలుపై మునిసిపల్ ఆక్టు 41 వ సెక్షన్ ప్రకారం చర్యతీసికొనవలసి వచ్చునని ప్రభుత్వము పంపిన హెచ్చరికను చైర్మనుగారు సభలో చదివి, వెంటనే బడ్జెటు ప్యాసుచేయవలసినదని సభ్యులను కోరిరి.

స్వతంత్ర పార్టీ సభ్యులు వల్లమూడి కోటయ్య చౌదరిగారు (69) (70) నెంబర్ల కాలూవ బడ్జెటుకు సంబంధించిన తీర్మానాలను యీ సమావేశములో చర్చింపరాదని, 11-2-48 తేదీన జరిగిన సమావేశములో ఏర్పాటుచేసిన బడ్జెటు సబ్ కమిటి ప్రతిపాదనలు కానిదే యీ సమావేశములో సదరు తీర్మానాలను చర్చింపరాదని పాయింటాఫ్ ఆర్డరును ప్రవేశపెట్టిరి.

చైర్మన్‌గారు సదరు పాయింటాఫ్ ఆర్డరును త్రోసివేసిరి. వెంటనే జనాబ్ మహమ్మద్ సాహెబ్ సాహెబుగారు (కాంగ్రెస్) బడ్జెటుకు సంబంధించిన సదరు (69) (70) నెంబర్లుగల తీర్మానాలను 30-3-48 తేదీవరకు చర్చించుటకు యీ సమావేశము వాయిదా వేయవలసినదిగా తీర్మానమును ప్రవేశపెట్టిరి. చైర్మనుగారు యీ తీర్మానముగూడ పాయింటాఫ్ ఆర్డరు కంటికిరాని త్రోసివేసిరి.

అంతట 14 మంది సభ్యులు తమ అసమ్మతిని వెల్లడించుచు సభను వదలి వెళ్లిపోయిరి. చైర్మన్‌గారు మిగిలిన 13 సభ్యులలో సదరు బడ్జెటును ప్యాసు చేయవలసినదిగా కోరినంతట శ్రీ ఉపద్రష్ట వెంకటరామయ్య (కాంగ్రెస్) గారు బడ్జెటును ప్యాసుచేయ వలసినదిగా ప్రపోజు చేసి బడ్జెటునుగురించి ఉపన్యసించుచుండగా సభను వదలి వెళ్లిపోయిన పదునాలుగు మంది సభ్యులు తిరిగివచ్చి చైర్మన్‌గారిని ఏమి కోయుచున్నారు. ఏమి వ్రాయుచున్నారని ప్రశ్నించిరి చైర్మన్‌గారు బడ్జెటు ప్యాసు అయినదనియు సమావేశము ముగింపబడినదని చెప్పుచు సభను వదలివెళ్ళిపోయిరి. పిమ్మట ఆ 14 మంది సభ్యులు తమ అసమ్మతిని (డిసెంటును) మినిటు పుస్తకములో వ్రాయించిరి. తరువాత ఆ 14 మంది సభ్యులు వల్లమూడి కోటయ్య చౌదరిగారి అధ్యక్షతను కవున్సిలు హాలులోనే జరిపిన సమావేశమై సదరు బడ్జెటు అక్రమముగా చేయబడినదనియు, సదరు బడ్జెటు సరియైనది కాదని తీర్మానించిరి. ఆ తీర్మానమును ప్రభుత్వం వారికి కమీషనరు గారికి అందజేసిరని తెలియుచున్నది. (స్వ. వి.)

## మునిసిపల్ కౌన్సిలర్లకు హితవాక్యాలు

బెజవాడ, మార్చి 25: "మునిసిపల్ కౌన్సిలర్లు పార్టీ రాగద్వేషములు లేకుండ పౌరులందరి శ్రేయోభివృద్ధికి పాటుపడవలెను. ఈ పట్టణ మునిసిపాలిటీ ఎన్నికలలో కాంగ్రెసువారు గెల్చుట కిది ప్రధానము. ఇందుకు కారణము ప్రజలకు మహాత్మాగాంధి అనినను, కాంగ్రెసు అనినను గల భక్తి శ్రద్ధలే. కనుక కౌన్సిలర్లు గాంధిగారి ఆదర్శములను పాటించుచు కాంగ్రెసు గౌరవము నిలబెట్టవలెను" అని స్థానిక న్యాయవాద ప్రముఖుడు శ్రీ కోట్ల రామయ్యగారు నిన్న నొక సభలో ఉపన్యసించిరి. ఈ పూరి మునిసిపాలిటీకి చైర్మన్‌గా ఎన్నిక అయిన గోనుగుంట్ల సుబ్రహ్మణ్య గుప్తగారికి, తదితర కాంగ్రెస్ కౌన్సిలర్లకు కేదవరపు లక్ష్మీ నరసింహారావుగారు చేసిన విందు చేసిన సందర్భమున ఈ సభ జరిగెను. సుమారు 200 మంది ప్రముఖులు విందుకు హాజరైరి. (స్వ వి)

## ఆచార్య కృపలానీ సంచార కార్యక్రమం

లక్నో, మార్చి 26: మహాత్మాగాంధీ జాతీయస్మారకనిధి కార్యదర్శి ఆచార్య కృపలానీ నిన్న నిక్కడకు వచ్చారు. రేపు కాన్పూరుకుండా జనాసెడ్‌పూరు వెడుతున్నారు. ఆయన ఇక్కడ గవర్నరు సరోజినీనాయుడు గారిని, ప్రధాని గోవిందవల్లభ పంత్‌ను కలుసుకొని స్మారకనిధి విషయమై సంప్రదించారు. జనాసెడ్‌పూరునుంచి అక్కడనుంచి కలకత్తాకు పోతారు. తరువాత 30 వ తేదీన కలకత్తా వెళ్లుతారు.

# కర్నూలులో దొంగతనాలు

## మునిసిపల్ కౌన్సిలర్లకు పోలీసువారి ప్రశ్నలు

కర్నూలు, మార్చి 26: గతవారము ఈ పూరి మునిసిపల్ కౌన్సిల్ సమావేశమునందు, ఈపట్టణమున దొంగతనములు అధికముగ జరుగుచుండుటవల్ల ప్రజలు చాల భయాందోళనలకు గురి అగుచుండిరని, ప్రభుత్వము తగుచర్య తీసుకోవలెనని ఒక తీర్మానమును ప్రతిపాదించిన మహమ్మద్ గౌస్, బలపరిచిన ఉప్పెపల్లి గద్దయ్య గార్లను గత ఇన్‌స్పెక్టరుగారు తీసుకు వెళ్లి డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటుగారి వద్ద హాజరుపరిచిరి. వారు వీరిరువురిని చాల ప్రశ్నలు వేసి వాఙ్మూలములు తీసికొనిరి. స్వ. వి.

## మునిసిపల్ కౌన్సిల్‌లో చర్చ

కర్నూలు, మార్చి 20: పట్టణములో మూడునెలలనుండి విపరీతముగా దొంగతనములు జరుగుచుండుటచే పురజనులలో ఆందోళన కలిగినదనియు, ఈ నేరములను త్వరలో నిరోధించుటకై ప్రభుత్వమువారు తగుమైన చర్యలను తీసుకొనవలెనని. నిన్న సాయంత్రం వైస్ చైర్మన్ శ్రీ పందిరపల్లె యాళ్లగారి అధ్యక్షతను జరిగిన స్థానిక మునిసిపల్ కౌన్సిల్ సమావేశములో కౌన్సిలర్ జనాబ్ మహమ్మద్ గౌస్‌గారు ఒక తీర్మానం ప్రతిపాదించిరి శ్రీ ఉప్పెపల్లి గిద్దయ్యగారు బలపరచిరి.

శ్రీ ఎ. రామక్రిష్ణారెడ్డిగారు ఆ తీర్మానమును వ్యతిరేకించుచు, ఈ తీర్మానములోని విషయముతో మునిసిపాలిటీకి ఏమాత్రం సంబంధంలేదని, స్థానిక పోలీసువారు సామర్థ్యములేనివారని, అప్రాగత్తగా సూచించుటకావము ఈ తీర్మానము కలిగించుచున్నదని ఇది సరియైనదికాదు, హైదరాబాద్ సరిహద్దులో ఇప్పుడున్న పరిస్థితులలో, పోలీసువారి సహకారము కోరుచుండవలసిందేగాని, వారిపైన నిందమోపుటకు సమయముకాదని, కనుక ఈ తీర్మానమును ఉపసంహరించిన బాగుండునని అనిరి. గౌసుగారు తీర్మానమును ఉపసంహరించుకొనిరి.

## పశువుల పరస; వ్యవసాయ ప్రదర్శనము

ప్రొద్దుటూరు, మార్చి 24: ప్రొద్దుటూరు పిర్కా వెంకటాపురం గ్రామమునందు 22 తేదీ మొదలు 24 తేదీవరకు పశువుల పరస, చేతిపరిశ్రమ ప్రదర్శనము జరిగెను. దీంతోపాటు వ్యవసాయ వస్తుప్రదర్శనము గూడ జరిగెను.

రావుల మునిరెడ్డిగారు ఆహ్వాన సంఘాధ్యక్షులుగను, బి. రామశాస్త్రిగారు, దండె కేశవయ్యగార్లు కార్యదర్శులుగను; ఈ కార్యమందు సభ్యులచే ఎన్నుకొనబడిరి.

కమిటీవారి నిర్ణయానుసారము బాగుగా మేపబడిన ఎద్దులు, ఆవులు, బర్రెలు మొదలైనవానికి జిల్లా వెటనరీ ఆఫీసరు కప్పవల్లి. తాలూకా వెటనరీఆఫీసరు లక్ష్మణరావుగారు బహుమానము లొసగిరి. పాటేటిలు, కోళ్లకుగూడ తగిన బహుమతు లీయబడెను తప్పెటల వాయించుటయందును, మేళతాళ నాగస్వర వివిధ వాద్యముల వాయించుటయందును పోటీలు పెట్టి యధోచిత పారితోషికము లొసగబడెను.

రాష్ట్ర కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు శ్రీ పి. తిమ్మారెడ్డిగారు ప్రారంభోత్సవము జరిపిరి. మొదటిదినము బుర్రకథలు, రెండవదినము నాటకములు, మూడవదినము తందరి భజనలు ఏర్పాటుచేసి వారికితగునట్లు బహుమతులిచ్చి గౌరవించిరి.

23 వ తేదీ సాయంత్రము బహిరంగ సభ జరిగెను. దానికి టి. భాస్కరరావు నాయుడుగారు అధ్యక్షత వహించిరి. పశువుల పంటలవలనను చేతిపరిశ్రమల వలనను గలుగు లాభములగూర్చి పలువురు ప్రముఖు లుపన్యసించిరి. అసిస్టెంటు డెవలప్‌మెంటు ఆఫీసరు సత్యనారాయణగారు ప్రొహిబిషన్ విషయముల వచ్చుటించిరి. (స్వ. వి.)

## ఆం. రా. మహిళా కాంగ్రెసు కార్యవర్గ తీర్మానాలు

ఆంధ్రరాష్ట్ర మహిళా కాంగ్రెసు కార్యవర్గము మార్చి 15 న విశాఖపట్నంలో సమావేశమై, ఏప్రిల్, మే నెలలలో రాష్ట్ర రాజకీయ మహిళాసభ, సేవాదళ నిర్మాణము జరుపుటకు తీర్మానించిరి. నిజాం సంస్థాన కాంగ్రెసువారి ప్రజాపోరాటమును బలపరచుచు ఒక తీర్మానము చేసిరి.

బాపూజీకి జోహారులర్పించి, అమరాదేవి మరణమునకు సంతాపము వెల్లడించిరి.

## యేటపాకలో అగ్ని ప్రమాదం

భద్రాచలం, మార్చి 22: భద్రాచలం తాలూకా యేటపాక గ్రామం ఈరోజు ఉదయము కొంతభాగము బూడిద అయిపోయెను. హరిజన వాడ కూడ దగ్ధమై పోయెను. ఈ ప్రాంతివారు పలువురు ఆ గ్రామం వెళ్ళి తోడ్పడిరి. (స్వ. వి.)

# మద్రాసు రేడియో

## మంగళవారం మార్చి 30

మదరాసు 2: ఉదయం 7-0 ప్యాగరం 7-10 తెలుగులోవార్తలు 7-20 రికార్డులు. 7-30 బి. నాగేంద్రదప్ప క్లారియొనెట్ 8-0 ఇంగ్లీషులో వార్తలు 8-15 రికార్డులు. 8-30 శంకర నారాయణన్ 9.0 ముగింపు.

మధ్యాహ్నం 12-30 ఆర్. పద్మ వీణ 1-0 మహిళామండలి 1-30 ఇంగ్లీషులో వార్తలు 1-40 రికార్డులు 2-0 వేణుగానం 2-5 తెలుగులోవార్తలు 2-10 వేణుగానం 2-15 పి. కె. రాజలక్ష్మి 2-45 రికార్డులు 3 0 ముగింపు.

సాయంకాలం 4-0 ఎలిమెంటరీ స్కూల్స్ కు 4-30 రికార్డులు 5-0 ముగింపు.

సాయంకాలం 5-30 ఆర్. కె. శ్రీరాములు ఫిడేలు 6-0 ఇంగ్లీషులోవార్తలు, 6-10 స్థానిక ప్రకటనలు 6-20 మరల కంఠంలో వార్తలు 6-30 గ్రామస్థులకు 7-15 తెలుగులో వార్తలు 7-30 పంటకాపు. ఉద్యోగప్రస్తావన శ్రీ నీలంరాజు శేషయ్యగారి ప్రసంగం 7-45 యస్. సి. వసంత కోకిలం 9-0 ఇంగ్లీషులో వార్తలు 9-15 తమిళనాటిక 9-30 రికార్డులు, (మద్రాసులో బి. బి. సి. వార్తలు) 9-40 కె. యస్. రాజం నాగస్వరం రికార్డులు 10-30 ముగింపు.

## శ్రీ త్యాగరాజస్వామివారి ఆరాధన

తిరుపతి, మార్చి 26: నిన్న నిచ్చట శ్రీ త్యాగరాజస్వామివారి ఆరాధన జరిగినది. వేటూరి ప్రభాకరశాస్త్రి, విస్సా అప్పారావుగార్లు శ్రీ త్యాగరాజస్వామివారి గుణాతిశయములగూర్చి పుపన్యసించుచు, ఈపూరులో త్యాగరాజ ఉత్సవము జరుపుట ఆంధ్రులకు అరవలకున్న స్నేహభావాన్ని పెంపొందింపచేయునని చెప్పిరి.

తిరుపతి దేవస్థానకమిటీ మత సలహా సంఘమునకు టి. కె. దురైస్వామి అయ్యంగారినిఅధ్యక్షుడుగా, అర్చకం రామస్వామి దీక్షితులు, టి. ఎ. పి శ్రీనివాసాచార్లు, రామచంద్రారెడ్డి, చిన్న జీయంగార్ స్వామిగార్లు సభ్యులుగా ఎన్నికఅయిరి. త్యాగరాజ ఉత్సవ సంఘకార్యదర్శి పి. రాధాపతిగారు వార్షిక నివేదికను సమర్పించుచు సంఘభవనమునకు విరాళము లివ్వవలయునని పురజనులను కోరిరి. ఒక సంగీత పాఠశాల నెలకొల్ప నుద్దేశించినట్లుకూడ తెలిపిరి. (స్వ. వి.)

## ఆంధ్రదేశ గ్రంథాలయ భవన శంకుస్థాపనోత్సవము

వడమటలంక, మార్చి 28: ఆంధ్రదేశ గ్రంథాలయ భవనమునకు నేటిఉదయం శ్రీ కల్లూరు కేశవరపుగారు శంకుస్థాపన జరిపిరి ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు శంకుస్థాపనా నంతరము ప్రసంగించుచూ యావదాంధ్ర దేశంలోను గ్రంథాలయోద్యమ వ్యాప్తికి కార్యక్రమం సాగించవలసియున్న యీ భవన నిర్మాణానికి ఎల్లరూ సాయపడవలెననియు, దీనితోపాటు వయోజన విద్యావ్యాప్తికి కృషిచేసి సర్వతోముఖాభివృద్ధికరమగు నవభారత నిర్మాణానికి తోడ్పడవలెనని కోరినారు.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘకార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణంగారు యీ భవన నిర్మాణప్రయత్నంలో యింతవరకు జరిగినకృషి, వసూలయిన మొత్తాలు, యింక జరుగవలసిన కార్యక్రమాన్ని గురించి వివరించినతర్వాత శంకుస్థాపనోత్సవం ముగిసింది.

